శ్రీ

# వేంకటాద్రి మహాత్మ్యము


BY

వి. కె. శేషాద్రి అయ్య[redacted]

పుస్తక వ్యాపారము,

తిరుచానూరు.





తిరుపతి శ్రీవ్యాస ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

దీనివెల] 1932 [0—1—0

శ్రీ

# వేంకటాద్రి మహాత్మ్యము.

BY


వి. కె. శేషాద్రి అయ్యంగార్,

పుస్తక వ్యాపారము,

తిరుచానూరు.





తిరుపతి శ్రీవ్యాస ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

దీనివెల] [0—1—0



శ్రీ

# వేంకటాద్రిమహాత్త్యము.



ఉ॥ శ్రీయనుమించు మించొలయ సేనకచాతక లోకమోదసం
ధాయకుడై యుదార కరుణారసవృష్టి దురాపతాపముల్ ।
వాయగఁజేయుచుం సకల వాంఛితసస్యము లుల్లసిల్లఁగాఁ
జేయుచు వేంకటాద్రి నివసించు ఘనుండిడుగాత భద్రముల్ ॥

శ్రీకరంబై సకలజన మనోరంజకమై సకల దేశములకును ముఖ్యమై నిష్ఠాపరులును, వేదవేత్తలను భూయిష్ఠంబైనిండియుండు భరత ఖండంబున నైమిశారణ్యము విలసిల్లుచున్నయది. అచ్చట పురాణములుజదువుట, యోగాభ్యాసము చేయుట, యజ్ఞముచేయుట, మున్నగు సత్కార్యములతో ఋషిశ్రేష్ఠులు తమకాలమును గడుపుచుందురు. ఒక్క సందర్భమున మునులందరును సూతునిజూచి " ఓమునిపుంగవా! సకల పురాణములును తమచే కర్ణామృతముగా విని తృప్తిఁజెందితిమి. భరతఖండంబున విలసిల్లు 108 దివ్యక్షేత్రములయందును ముఖ్యమై కలియుగ వైకుంఠంబై సకల జనులకును ముక్తినిచ్చు వేంకటాద్రి మహాత్త్యమును సవిస్తారముగా మాకు జెప్పవలయుననికోరిరి.

అందులకు సూతుండు తిరుపతి మహాత్త్యమును జెప్పదొడగె కృతయుగమున విష్ణుపరమాత్మ భూలోకమునందు విహారమునకేతెంచి యిందే కొంతకాలము వసించునట్లు కుతూహలమొదువ గరుత్మంతుని బనిచి క్రీడాచలమును వైకుంఠమునుండి తెమ్మని దానిని స్వర్ణముఖినదీ

తీరమున వైచుకొని యందు వసించుచుండె. తిరిగియు వైకుంఠమును జూడఁగోరి వరాహరూపముతో నున్న విష్ణువు లక్ష్మీసమేతుండై వైకుంఠము జేరిరి.

—: భృగుముని త్రిమూర్తులఁ బరీక్షించుట :—

దుష్టనిగ్రహమును శిష్టపరిపాలమును చేయుచు హరి భూలోకమందు లేకున్న పామరజనులు కలిమాయకు జిక్కి దైవసంస్మరణమాని చెడి పోదురు గదా యని కలహప్రియుడగు నారదమహాముని విష్ణువును సురల భూలోకమునకు రప్పించు విధమును యోచించెను. అప్పుడు నైమిశారణ్యంబునందు శౌనకాదిమునులు బ్రహ్మను గురించి గొప్ప యజ్ఞము చేయుచుండిరి. నారదుడు వారియొద్దకుంజని "మునిశ్రేష్ఠులారా! ఈయజ్ఞఫలము నెవ్వరికి అర్పించెదరనవుడు మునులు వూరకుండిరి. అందులకు నారదులు తపోధనులారా త్రిమూర్తులందు సత్వగుణసంపన్నులెవరో విచారించి వారికిమ్మని సెలవిచ్చి యంతర్ధానుడయ్యె. ఋషీశ్వరులెల్లరును యోచించి బృగుమహామునిని దీని నిక్కమును విచారించుకొని రమ్మని పంపిరి. బృగుమహామునియు బ్రహ్మయొద్దకుంజని వారానతియిచ్చుటకుమునుపే ఆసనాసీనులైరి. అందులకై బ్రహ్మ వీరిని విచారింపకనే యుండిరి. బృగుమహాముని వారు రజోగుణులై యుండుట నెఱింగిరి. పదంపడి కైలాసమునకుంబోయి నిలువ శివుడు కోపగించి మూడవనేత్రమును తెరువ వారు తమోగుణులని యెంచి కడపట వైకుంఠమునకుం జనిరి.

అచట విష్ణుమూర్తి లక్ష్మితోడ క్రీడసలుపుచుండ అయ్యది విచారించక బృగుమహాముని హరి వక్షముందన్నెను. హరి కోపమొందక వారిని సాదరముగా విచారించెను. మునియు అదియెఱిగి స్వాత్వికా

గుణ సంపన్నుడైన విష్ణుని ప్రదక్షిణములు చేసి తిరిగియు నైమిశారణ్యమునకు జని యజ్ఞ ఫలమును విష్ణువునకిచ్చి విష్ణుసేవా దురంధరులై యుండిరి.

—: లక్ష్మి యలుగుట :—

బృగుమహాముని సత్కరింపబడుట నెఱింగిన లక్ష్మిదేవి భర్త యెడల విరోధము జేసి యలిగి "యిటువంటి భర్తతో నివసింపరాదని" యెంచి భూలోకమునంగల కొల్లాపురము జేరెను.

—: హరి మరల భూలోకమునకు వచ్చుట :—

భార్యావిరహమును ఓర్వలేక హరి తాను వేంకటాచలమందు చేరి యందొకపుట్టలో నివసించుచుండెను. తాను కోపముతో నుండినను విష్ణువు వేంకటాచలము జేరినదెఱింగి తాను ఆలకాపరి వేషము ధరించి బ్రహ్మరుద్రులను గోదూడ రూపము ధరింపజేసి యవ్వాటి నిదేశాధీశుడైన చోళరాజునకు అమ్మెను. నూతనముగా కొనిన గోవు మేయుటకు పోవునపుడు అనుదినము వేంకటాచలమునెక్కి పుట్ట యందు నివసించు శ్రీనివాసుని తన క్షీరముచేత తృప్తిపరచుచుండెను. క్షీరము లేమి నెఱింగి రాజు కాపరినిబిలిచి నిజంబరసిరమ్మనపుడు వాడు మఱుదినము పశువు వెంటనే జనెను. అది నేరుగా శైలమెక్కి పుట్ట కుంజని యందు క్షీరమును యిచ్చుటయును, దానిని యెవరో త్రాగుటయు కనుగొనెను. తోడనే తన చేతియందున్న గొడ్డలిచే విసరి వేయ అది పుట్టయందున్న హరికి నెత్తియందుతగిలి రక్తప్రవాహము బయలుపడెను. ఆరుధిరమునుజూచి పశుల కాపరి మూర్ఛబోయి మృతినొందెను. ఈ యుదంతం బెరిగిన చోళరాజు నిజంబరయ పుట్టయొద్దకురాగా హరి యతనిని పిశాచమగునట్లు శపించెను. రాజు శాపముగొని హరినవేక

విధములుగా ప్రార్థించ భూమియందు ఆకాశరాజు పరిపాలింపు వేళ వారి పుత్రికను నేను పెండ్లియాడెదను వారు నాకు శుక్రవారమునందు మాత్రము ధరించుకొనగల నవరత్నఖచిత కిరీటమును సమర్పింతురు. ఆకిరీటము "నాశిరమందుండువరకు మాత్రము నీకుపిశాచగాపము లేకుం డుగాక యని శాపమును గొంతమార్చెను.

—: వరాహమూర్తికి ప్రాధాన్యమేర్పడుటకు కారణము :—

హరి దెబ్బకుతాళక చికిత్సోద్దేశ్యముతో బృహస్పతిని స్మరింప వారు ప్రసన్నులై దూదియు జిల్లేడుపాలును వేయమనిజెప్పిపోయె. హరి నిజరూపులేక నరరూపముతో మందువెదక బోవుచుండ వరాహ మూర్తి యెదురుపడియె. వారితో వృత్తాంతముం దెలుప వారు వీరికిని వాసమునకు జాగయు, శుశ్రూషకు తనవద్దయుండిన వకుళమాలికను యిచ్చెను. వేంకటేశ్వరులు అందుపై నాభక్తులు చెల్లించు పైక ముచే తమకు భూక్రయము నిచ్చెదననియు వారిని తమ్ము ముందు పూజించి దర్శనముచేసుకొనిన పిదప నావద్ద రప్పించెదననియుజెప్పి ప్రాధాన్యతనిచ్చిరి. అదిమొదలిదివరకు వరాహమూర్తికి ముందుపూజలు జరుగును.

—: పద్మావతీ దేవిజననము :—

పాండవ ద్రోహి త్రివంశమునందు సుధాముండనురాజు తనకు సంతానములేమింజేసి వేంకటాద్రిజేరి పుణ్యతీర్థంబులం గ్రుంకి తపమాచ రింప నాతనికి స్వామి కటాక్షంబున ఆకాశరాజను పుత్రుడుద్భవిల్లెను. ఆకాశరాజు" పుత్రికామేష్టియాగమొంకు జేయనెంచి భూమినిదున్నెను. అప్పుడు బంగారు నాగేలిపట్టి దున్నభూమి శృంగారపద్మము జూపట్టగా ఆపద్మమందునఅమరిన మాయమ్మ అలమేలుమంగమ్మ యమ్మ రమణి

అన్నట్లు రాజునకొక్క పెట్టయగుపడగా దానిందెఱచిచూడగా నందు వికసించిన పద్మము చూపట్టెను. ఆపద్మములో దేదీప్యమానముగాను సకల రూపలావణ్యముతోను తేజరిల్లుచున్న స్త్రీశిశువొండు కనబడగా రాజు శిశువును తనభార్యయొద్దకుంజని చూపగా యిరువురును సంతాన లాభమునకు సంతోషభరితులై పుత్రికకు "ప ద్మా వ తి" యని నామం బిడి యతిగారాబముతో పెంచసాగిరి.

—: వేంకటేశ్వరులు మోహపరవశులగుట :—

ఇట్లు పద్మావతీదేవి దినదిన ప్రవర్తమానంబై యుక్తవయస్సుకు వచ్చి యనుదినంబును నందవనమునకుంజని పూలుకోయుట మున్నగు విహారములు సలుపుచుండెను. మృగయావిహారార్థము వేంకటేశ్వర్లు ఒకదినము అరణ్యమునకుంజని వేటలాడెను అచట మదించిన ఏనుగ ఒకటి స్వామిచేతికి చిక్కక త్రిప్పెను స్వామి తిరిగి దానిని బహు దూరముతరుముచు తుట్టతుదకు బాణము వేసెను. కరి పదంపడి పద్మా వతి నందవనమునజొరబడి యచటను తనకుగతిలేక స్వామిని శరణుబొంది మోక్షముబొందెను.

వేంకటేశ్వరులు నందవనములో విహారముసలుపుచుండిన కన్యా రత్నమునుజూచి దాని రూపలావణ్యమునకును చక్కదనమునకును మోహపరవశుడయ్యె. అట్టి లలనాతిలకమును బడయగోరి లోనికి జని దానితో సంభాషింప ప్రయత్నించెగాని పద్మావతి కోపపడి స్వామిని లోనికి రానివ్వక భయపరచెను. "కామాతురాణాం నభయం నలజ్జా" యన్నట్లు వారి యుభయలజ్జలుమాని లోప్రవేశింప పద్మావతి వారిపై తనచెలికత్తెలచే రాళ్లు ఉువ్వించెను. వేంకటేశ్వరులు యికచేయునది లేక ఖిన్నులైపోయి మరల వేంకటాద్రిజేరిరి.

—:హరి సోనెకత్తి వేషముదాల్చి వివాహము నిశ్చయముచేయుట:—

నాటిదినము మొదలుకొని వెంకటరమణునకు మనస్సు నిలుకడ లేకపోయెను. ఉద్యానవనమునఁ జూచిన కన్నియసొంపు, రూపలావణ్యము తలచుకొని మోహపరవశుఁడై యుండుటను పరిచర్యలు చేయుచుండిన వకుళమాలిక హరిచే నాయుదంతంబంతయు నెఱింగి తానే నారాయణవనమునకుఁబోయి వివాహము నిశ్చయముచేసి వచ్చెదనని బయలుదేరెను.

వకుళమాలిక నారాయణవనమున కేతెంచి యచట రాజస్త్రీలందఱును పూరివెలుపటనుండు కాళికాదేవి పూజసేయఁ గుమిగూడి యుండగా వారలతోఁ గలిసి తనవృత్తాంతమును నెఱుంగఁజేసి వారలతో రాజగృహము ప్రవేశించెను.

వేంకటాచలమున హరికి మనస్సు నిలుకడలేక తాను సోనెకత్తె వేషముదాల్చి రాజగృహమునఁజేరి రాణినిఁజేరి ఆమెకు "మీకుమార్తె పద్మావతి చాలధన్యురాలు ఆమెను సాక్షాత్ విష్ణుమూర్తియేయగు వేంకటేశ్వరులు పెండ్లియాడును. ఇందునకు దృష్టాంతముగా నిక కొంతలో వారివద్దనుండి వార్తరాగలదు" అనిచెప్పి యెప్పటివలె తన వాసముచేరెను. వకుళమాలికయు రాణియొద్దకుఁ బోయి తాను తెచ్చిన శుభవార్తను వారి సమ్మతిగైకొని మరలె.

వేంకటేశ్వర పద్మావతి వివాహమహోత్సవము,

నారాయణపురము నేలుచుండిన ఆకాశరాజు తన గురువులగు శుకులను రప్పించి ముహూర్తపత్రికవ్రాసి వారిచేతనే వేంకటేశ్వరులకు పంపించెను. శుకులు వేంకటాద్రిజేరి పత్రికనిచ్చి హరివద్ద బదులు పత్రికను దీసుకొనిపోయిరి.

మఱియు బ్రహ్మరుద్రాది దేవతలతోను యక్ష గంధర్వ కిన్నర కింపురుషులగు దేవగణంబులతోను నారాయణపురమునకు విచ్చేసిరి. కొల్లాపురమునకుబంపి లక్ష్మినిమార్యునిచేరప్పించి యామెసమ్మతముతో శుభముహూర్తమున పద్మావతీదేవిని పెండ్లి యాడి భక్తులను ఆదరించు టకై హరి వేంకటాచలముచేరిరి.

యిట్లని వేంకటాద్రిమహిమ సంపూర్ణము.

కం॥ భూషణములు చెవులకు బుధ
తోషణము లనేకజన్మ దురితౌఘవిని ।
శోషణములు మంగళతర
ఘోషణములు గరుడగమన గుణభాషణముల్ ॥



